M. NO Reg. 2580.

సం॥ చందా రు 4 లు




జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు

| | | | | |
|---|---|---|---|---|
| సంపుటము 2 | శనివారం | 25–3–33 | నెల్లూరు | సంచిక 29 |

నెల్లూరు జిల్లా

# ద్వితీయ జమీందారీ రైతు మహాసభ.

జయంపుగ్రామమున

**2–4–1933** తేది ఉదయం 9 గం॥ కు జరుగును.

ప్రారంభోత్సవము

డి॥ బ॥ బి. మునిస్వామినాయుడుగారిచే జరుపబడును.

అధ్యక్షులు.

## శ్రీసామి వెంకటాచలం శెట్టిగారు

నెల్లూరుజిల్లాలోని అన్నిజమీందారీల నుండియు రయితులు దయచేసి కష్టనిష్ఠూరములు వచ్చించి నివారణోపాయముల నరయుదురని కోరుచున్నాము.

యల్లచెంచువెంకటసుబ్బారెడ్డి, నె. వెంచలురెడ్డి, కార్యదర్శులు.

పుత్తేటినారాయణరెడ్డి, ఆహ్వానసంఘాధ్యక్షుడు

మరి:—జయంపుగ్రామము గూడూరు, వెంకటగిరి స్టేషనుల మధ్యనుండు వెందోడు రయిలుస్టేషనుకు 1 ఫర్లాంగులో నున్నది. ఇచ్చటకు గూడూరునుండి వెంకటగిరికి పోవురోడ్డునుండి బ్రాంచిరోడ్డు కలదు. గూడూరునుండి రేణిగుంట వైపునుండి వచ్చువారలకు ఉదయమునసె రైళ్ళుకలవు సాయంత్రముకూడ అనుకూలముగు రైళ్ళుకలవు. రైలునుండి వచ్చువారికి మాత్రము మధ్యాహ్నము భోజనవసతులు ఉచితముగా చేయబడును. చుట్టుప్రక్కలనుండి వచ్చువారలు మాత్రము తగు జాగ్రత్తతో రావలెనని కోరుచున్నాము. సభలో ఓటుచేయుటకు ఆహ్వానసంఘమువారివలన టిక్కెట్టు పొందినవారికి మాత్రమే అర్హతకలదు.

---

## వెంకటగిరి సంస్థానం

### వకీలుగారి రాక.

మ-రా-రా-శ్రీ వి. వేదాంతాచార్యులవారు మాగ్రామం 10-3-33 తారీఖున దయచేసినారు. వారితో కష్టములు మనవి చేయుటకు రయితులు చాలామంది విచ్చేశి చెర్వులకట్టలు భూముల అబందర కట్టుల హీనస్థితి చూడవలయుననిన్నీ శక్తి పోయినభూములు తనిఖీచేయవలయుననిన్నీ, భూములస్థితిని చూడవలయుననిన్నీ, యేలాటి నీటి వసతిలేని నిస్సారమైన చవిటిభూములకుహాంసా యీగ్రామములకంటె జాస్తి రేట్లు విధించియున్నారనిన్నీ, యీమితిలేని శిస్తులను భరించజాలక కొంతమంది భూములు, యిండ్లు, వదలుకొని పరాయిగ్రామములకు వెళ్ళియున్నారనిన్నీ, యింకనూ వెళ్ళనున్నారనిన్నీ, భూములన్నియు వదలుకొని మేము వెళ్ళుతాము, డిక్రీలు, మేము జీవించుచోట అమల్పు జరపవద్దనియు, దిట్టం, పట్టాలు మార్చనందున చాలాయిబ్బందులుకలిగినవనియు, మొరపెట్టుకొనగా వారికి మాయందు చాలాదయగలిగి శాంతహృదయముతో వెంబడివచ్చి అన్నియుచూచి విచారించి న్యాయంకల్గచేస్తామనియు రయితు సంఘము వుండుట తమకు అయిష్టము లేదనియు ఆట్టిసంఘములో తామునూ పాల్గొందుమనియు, కష్టములను గమనించి అందరికి డిక్రీలలో చాలావరకు కనికరము చూపుచున్నామనియు, దిట్టములు యీఫసలీ ఆఖరులోపల అనుభవ ప్రకారం మార్పుచేయుటకు యత్నించియున్నామనియు, మొదలగు ప్రియములైన వాక్యములు వచించినందున మాకు చాలా సంతోషమయినది. వారుచెప్పిన వాగ్దానములు నెరవేర్చినయెడల యికనైనను బాగుపడగలమనియు, వాగ్దానములు వారుతప్పక నెరవేర్చుదురనియు విద్యాధికులయినందున మాకష్టములు పూర్తిగా గమనించియుందురనియు వారినే భగవంతుడనియు పూర్తిగా నమ్మియున్నాము.

చేనిగుంట రయితు.

## చిన్న జమీందారులు— చక్కనిపరిపాలన

---

శేవాటిమునిస్వామిరెడ్డి

చెంగల్పట్టుజిల్లా మదరాంతకం తాలూకా గ్రామములను నేనుకనులార చూచితిని. ఆగ్రామములయొక్క చెర్వులు వాటికివచ్చు నీటివసతులు యెంతో తృప్తికరముగాయున్నవి. ప్రతిసంవత్సరం చెర్వుల రిపేరీలు జర్గుచున్నవి. యేగ్రామ చెర్వుకు సరియయిన రిపేరు ఆజమీన్దారు చేయనపుడు అప్పుడే కలెక్టరుకు అర్జీలనిచ్చి రయితులు పనులుచేయించి పనిచేయించిన మొత్తమును ఆ రయితులు చెల్లించవలసిన శిస్తులలో ముజరాతీసుకొంటారు.

భూములు.

య 1 కి సరాసరిన $1\frac{1}{2}$ వకటిన్నర పుట్టికిమించి 2 పుట్లవరకు పండునట్టి భూములువారు కొంతభూములుమెట్టయినను కొంతభూములు నాటుయున్న, వేయుమరు చెర్వులు గొప్పచెర్వులగుటవల్లను చెర్వులలో నీరు మిగిలియుండుటవల్లను పెన్నానది వంటినదులు లేకపోయినను సకాలములకు పయిర్లు పండుతవి. య 1-కి క్రియం వేలసంఖ్యలేగానినూర్ల సంఖ్యకాదు. శిస్తులు, కొన్ని జమీన్గ్రామములకు రు 8-0-0 లును కొన్నిగ్రామములకు రు 7-0-0 లును కొన్నిగ్రామములకు రు 6-0-0 లును మొదటి తరహారేట్లు అయివున్నవి. సిస్తువసూలు ఆయాగ్రామకరణములు మణేగార్లే వాయిదాలప్రకారం వసూలుచేయుదురు. రెంటుసూట్లు అనునది యెరుగనే యెరుగరు. జమాబంది ఆయాసంవత్సరం ఆయాగ్రామములోనే తప్పకజరుపుతారు—

రైతులస్థితి.

యిచ్చటయుండు రయితొవారీ రయితులకన్న యెక్కువ సౌకర్యములతో సకలసంపత్కరములతో వుంటున్నారు. అయితే నెల్లూరుజిల్లా రయితొవారీ రయితుల మాదిరి విరివిగా ఖర్చులుపెట్టరని తోచుచున్నది—

జమీన్దార్లు.

చూనాంబట్టు జమీన్దారు అరుణాచల మొదలియార్ గారికి 40 గ్రామాలున్నవి. యెక్కువ నీటివసతిగల గొప్ప చెర్వులు ప్రతిచెర్వుకు అలరాయికట్టియున్నది. ప్రతిచెర్వుమీదను జమీందారు జీతముతో 1-2 నౌకరులు యింకను యెక్కువగను నియమించి వారిద్వారా నీళ్లు భూములకు సప్లయిచేయబడుచున్నది—

2 పొంజూరు జమీన్దారు వాసురెడ్డిగారు వీరికి 15 గ్రామాలున్నవి—

3 చెయ్యూరు జమీన్దారు రామస్వామిమొదలియారు వీరికి 6 లేక 7 గ్రామాలున్నవి—

4 అనికట్టుమిట్టా జమీన్దారు కొ. వెంకటపెరుమాళ్లురెడ్డిగారు. వీరికి 6 గ్రామాలున్నవి—

5 కవప్పాకం జమీన్దారు ముద్దు వెంకటపతిరెడ్డి ముద్దుకొమరప్పరెడ్డియార్ వీరికి 10 గ్రామాలున్నవి. వీరికిచాలాపారెస్టువున్నది అది జమీన్దారు కాపుదాలో వుంచుకొని రయితులకు మడిఆకుకు పెట్టి సుంకమును విధించక వుచితముగా కోసుకొని భూములకు వేయమని రయితులను నిర్బంధించుతారు—

6 పులంబాక్కం జమీన్దారు తాతారెడ్డి వీరికి 8 గ్రామాలున్నవి—

యీ ఆరుజమీన్దార్లు ఆరయితులకు చేయుసౌకర్యములు ఆచెర్వులు ఆభూములు ఆరయితుల సంపత్కరములు వారి గృహములు వారిపశ్వులు వారిసుఖములు వ్రాయనలవిగాదు. వేయేల మనవెంకటగిరి సంస్థానములో వెతకినను వకగ్రామముగాని లేక వక ఆసామీగాని వక్క శేద్యము మీదనే ఆధారపడి యుండువాడు మచ్చునకయినను కానరాడని నిస్సంశయముగా చెప్పవచ్చును.

(సశేషము.)

## తిక్కన వర్థంతికి ఎంతటి తెగులు పుట్టింది!

---

అవిపోత్రము వజ్రపంజర నిభం బై, నిశ్చలం బైన వ । ద్యానంబగన సాహచర్య గుణసంపర్కంబునకా లోహమై । గ్రావం బై దృఢదారువై, తరుణ వృక్షం బై ఫల ప్రాయమై । పూవై, తన్మకరందమై కరగు పోపో నీళ్ళకు నల్పమై.

అదేగతి బట్టినదయ్యా నీవర్థంతికి! ఆంధ్రమహాపండితలోక సార్వభౌములగు వెంకటరాయ శాస్త్రిగారిచేతను, తెలుగు కవిలోకమున అమృతమయ కవిత్వము చేత వన్నెవాసిగన్న తిరుపతివారిచేతను, రసిక సంహారణ లాలసరీతి కరిగిపొమ్మడి మధురాంధ్ర సాహిత్య కాంతితో విమర్శకేసరి చక్రవర్తి అయిన రామలింగరెడ్డి చేతను, యింకనూ పండితులు, విమర్శకులు కవుల రాకచేత మహాశిల్పి, కవిబ్రహ్మ మనవ్వారి పరువు, తిక్కన వర్థంతి మహోజ్వలము చేయబడి వివిధ ప్రాంతముల నుండి ప్రేక్షకుల నాకర్షించి నిర్జీవమైన సంవత్సరమున ఒకసజీవ ఉత్తేజ రసాత్మమైనదినమును నెల్లూరుకు గూర్చుచుండినది. అదే నేడిట్లు నానాటికి తీసికట్లయి తెలుగురాని ఒకరాజాగారిచే అధ్యక్షత వహింపబడుట తిక్కనచేసుకొన్న పాపము నెల్లూరువారికి తీరని కళంకము.

ఒకరాజు అధ్యక్షుడు, ఒకరాజేంద్రుడు వుపన్యాసకుడు అనగా సంతోష పడితిమి. కానీ జ్వరమునకు బుద్ధిలేదు. రాజును రాజేంద్రుని పీడించి రసభంగము నుచేసెను. పాపం! నిజముగాకొందరు జ్వర పీడితులు కార్యక్రమమున పాల్గొనవలసిన వారు తమ జ్వరము మాట బయట పెట్టలేదు.

ముందు యీ దౌర్భాగ్యపు పరిస్థితులకు కారణాలు విచారిస్తాం. పూర్వము శ్వేతజాతులకు బానిసత్వము చేసిన నీగ్రోలు విధిని దూరుచూ ప్రాడిగను చేసేవారు కాని బానిసత్వము భగవానుని సంపూర్ణ కృపాకటాక్ష ప్రాంగావలోకనముచే ప్రసాదింపబడిన వరమని భావించు ఒకతెగ నెల్లూరులో తయారై మున్నటి వర్థంతి నడిపేవారిలో చేరినట్లున్నది. అందు స్వలాభమును చూచుకొని అర్హతలేని వారిని అధ్యక్షులు చేయుట యెన్నదగినది కాదు. విద్యార్థులు స్వాతంత్ర్యప్రియులు గుఱ్ఱం సుబ్బరామయ్యగారు గొల్లభామమాదిరి మెగురుచూ, రాజాగారికి విపరీత వినయమును జూపుట ప్రేక్షకులకందరికి యేవగింపు పుట్టించినది. ఇక వెంకటగిరి సంస్థానపు వంది, మాడభూషణ నరసింహాచారిగారి ఉపన్యాసం చాలా నీచముగను అప్రస్తుతముగను నుండి స్థానకాల భ్రష్టత్వములచేత తృష్ణాపరునికి వివేచన ఉండదను సల్లుతోపింపజేసినది. యాహ్యాలిగారికిచ్చే పెద్దకేసులను తనకిమ్మని గాబోలు నాటి ప్రార్థనంతా.

ఇక నాటికార్యక్రమంతీరు: వచ్చుచున్నారు వచ్చుచున్నారు అని 5 ఘంటలకు వచ్చిన ప్రేక్షకుల నందరిని 6 ఘంటల వరకూ కూలేసినారు. వచ్చినారు రాజాగారు ఆరు ఘంటలకు! తనరాజకీయ నిశిత ప్రజ్ఞకు మదరాసు రంగము చాలదని ఢిల్లీ దర్బారుకు ప్రాకిన మహానుభావులు వీరేనా అని అనుకొన్నాం. వారి రాకతోటి స్టేజీమీద ప్రారంభమైనది బానిస నాటకం. రాజును, రాజేంద్రునికి మాలలు వేసినారు, యింతనూ సరుకుండి, మాలకు అర్హతగల రామదాసయ్యంగారికి, పురాణం చెప్పిన ఆచారిగారికి వెయ్యకపోవటం వక్రబుద్ధిని దెల్పుతున్నది. రాజుగారు మాట్లాడినారు! తిక్కన కవిత్వంలో అకని కలగా మెరిట్సు మనకెవ్వరికి తెలియవు(ఏమి సాహసం!) కాబట్టి to go into the matter ఒక సబ్ కమిటీని ఇతరులనుతో తిక్కన కంపేర్ చేయుటకు. విమర్శించుటకు కాదు- వేయవలెను. ఇటువంటి అసెంబ్లీలవల్ల చాలా లాభంగలదు అని తమ అపూర్వ రాజకీయ పరిజ్ఞానమును వెల్లడిజేయుచూ యింగ్లీషులో అన్నారు. వాక్యమములో యినికొత్తకేతే అబ్బా! ఎక్కడనో కనిపెట్టినాడే! అని అనుకొంటుండగనే జ్వరమని చెప్పి వారు జోహుకుం నరిసింహాచారి గారిని అధ్యక్షులు నామినేటుజేసి రాజాలు కూర్చున్నారు.

నరసింహాచారి గారిదగ్గర 50 యేండ్లనాడు యెవరో ఒకపల్లెటూరి తెలుగు బడి పంతులు వ్రాసి పీఠికగా ప్రీతి పూర్వకముగ అర్పించిన ఒక తిక్కన మీద వ్యాసముగలదు. మహానుభావుడు దాని తాడు తెంచ తాడనుకొన్నాం కాని, రాజుగారిని పొగడను మల్లినాడు. ఇక రాజుగారు జ్వరము సంగతి మఱచి అక్కడ గూర్చుండి ఆస్తాన పాటల్లో కరిగిపోవుచుండినారు. ప్రేక్షకులలో ఒకరు యింకా వుపన్యాసకులున్నారే, అప్పుడే కృతజ్ఞతావందనాలు చెప్పుచున్నారే అని స్వారస్యముగ మందలించినారు. ఒకవిధముగ నరిసింహాచారిగారు స్మృతికి వచ్చినారు. బాగా పద్యాలు చదువుచుండిన దీపాల పిచ్చయ్య శాస్త్రిగారికి గుఱ్ఱం ఆయన అడ్డురాకుంటే ఒక కొంత స్వారస్యముగ నుండేది.

నాటి అధ్యక్షుని పాండితికి యూనాదిరెడ్డిగారు వుపన్యాసకులైతే చాలా అతికినట్లుండేదని నాతో ఒకరన్నారు. ఆసంగతి "హాలికుడి"తో పోయి చెప్పు అన్నా.

వర్తమాన సమాజము నిర్వాహకులారా! యికనైనను మహాకవి తిక్కన వర్థంతికి అర్హులను పిలపించి పుణ్యము గట్టుకొనుడని ప్రార్థిస్తున్నాను.

ఒక ప్రేక్షకుడు.

జమీందారీరైతు

25—3—33

శనివారము

## జమీన్ రయితు మహాసభ.

నెల్లూరుజిల్లా జమీందారీ రైతు మహాసభ ఏప్రిలు 2-వ తేదిని వెంకటగిరి డివిజనులో జయపురాగ్రామమున జరుగనున్నది. అధ్యక్షులు శాసనసభా సభ్యులైన సామి వెంకటాచలము శెట్టిగారు. ప్రారంభోత్సవము జరుపునది, ది॥ బ॥ బి, మునిస్వామి నాయుడు గారు. ప్రథమసభ 1931 సం॥ సెప్టెంబరు 8, 9, తేదులలో వెంకటగిరిలో 144 సె॥ నిషేధముతో ప్రారంభమైనది. అది మొదలు నేటివరకును వెంకటగిరి జమీందారీలో మనస్పర్థలు ప్రబలి తాత్కాలికముగా కొన్ని ఉపశమనములు జరిగినవి. కాని ముందు యెన్నియో ముఖ్యసమస్యలు తీర్మానములు కావలసినవి అట్లే యున్నవి.

యీజమీందారీ రైతు యుద్యమము కొందరనుకొన్నట్లు వ్యక్తి ద్వేషముతో ప్రారంభింపబడినదికాదు. కొన్ని నాండ్లు సంవత్సరములుగా లోలోపల కుములుచుండినది. పరిపాలకులు సమర్థులైనప్పుడు తాత్కాలిక పూరటలతో ఉపశమనము పొందుచుండినది. అట్టిది లోపించిన వెంటనే లోపల రగులుచుండిన అగ్ని వెలుపలకు ప్రసరించినది. అంతేకాని నేడు క్రొత్తగా యీ యుద్యమము పుట్టబడిన దనుట సత్యముకాదు. నిజముగా లోతుకు దిగి ఆలోచించినచో జమీందారీరైతు దుర్గతి చెప్ప శక్యముకాదు. ఎన్నియో బాధలు, ఎన్నియో చిక్కులు కలవు. రైతు, జమీందారుల మధ్య సంబంధ బాంధవ్యముల నెంచవలసిన చట్టము అసంపూర్ణముగా నున్నందున చట్టములేని దినములకంటె కొన్ని యిక్కట్లు రైతును యెదుర్కొనినవని చెప్పవలసి యున్నది. యీ యిబ్బందుల వెలుపలి ప్రపంచమునకు బహిర్గతపరచుటకు యెన్నియో చిక్కులు రైతును ఆవరించినవి. విద్యావిహీనత యొకటి, బలవద్విరోధ మొకటి. ఈ రెంటి వలన కొన్ని సంవత్సరములుగా రైతు యిక్కట్లను బహిర్గతపరచుటకు వీలైనది కాదు.

పూర్వకాలములు గతించినవి. పూర్వపు జమీందారులు తమ భోగభాగ్యములకు మూలకందమగు రైతును కన్నబిడ్డకంటె యెక్కుడుగా ప్రేమాదరములతో జూచుచుండిరి. రైతు అవసరముల రైతుకంటె జమీందారులే గుర్తించి తీర్చుచుండిరి. నేడన్ననో "రెంటికి చెడ్డ రేవడి వలె" రైతును, అటు జమీందారుగాని ఇటు చట్టముగాని ఆదరించుట లేదు. ఇదివరకు కాలముకంటె నేడు ప్రపంచమునందంతయు, స్వాతంత్ర్య వాయువులు ఉద్ధూత వీచుచున్నవి. ఆకారణమున దివాంధమువలె స్వాతంత్ర్య భానోదయములకు దూరస్థులైయున్న జమీందారీరైతులుకూడ నూతన భావారుణోదయముల నాహ్వానించ సాగిరి. ఇది పూర్వవాసనల వీడని జమీందారులకు రుచించినదికాదు. ఇదియే జమీందారులకును, రైతులకును మనస్పర్థల కవకాశమిచ్చినది. యీ ముఖ్యసూత్రమును జమీందారులు గమనించి వయస్సువచ్చిన బిడ్డయెడ తల్లిదండ్రులు యుచితరీతి మెలగినట్లు మెలగినచో యీయుద్యమము యింత బహిర్గతమగుటకు వీలుగాకుండెడిది. యీ విషయమున జమీందారులు దీర్ఘాలోచన చేయకుండుట విచారకరము.

కాని నేటి పరిస్థితులబట్టి యింతపెద్ద సమస్యల జమీందారుల కేవల దయాధర్మములపై వదలక రైతుహక్కుల నిర్ణయించవలసిన అవసర మేర్పడుచున్నది. జమీందారుల దయాధర్మములపై వదలుటనుబట్టియే వ్యక్తులనుబట్టి మంచిచెడ్డల నిర్ణయించవలసిన అవసర మేర్పడినది. కావున యికముందట యిట్టి నిర్ణయమును కోరిదారిలి రైతుహక్కును నిర్ణయించుకొననిచో కొంతకాలమునకు యీజమీందారీరైతు పూరుపేరులేని స్థితికి రావలసి వచ్చును.

ఇతరదేశముల జమీందారులు నేను పేరునకు జమీందారు శబ్దమునకు వాచ్యులైయున్నారేగాని హక్కులన్నియు ప్రజలచేతులలోకి వదలబడుటచే ప్రజల దయాధర్మములపై ఆధారపడియున్నారు. అట్టి కాంక్షలనే యీదేశ ప్రజలుగూడ వాంఛించుట అపచారము కాజాలదు. కాని యీదేశ జ॥ రైతులు కోరెడి కోర్కెలు యితరదేశ రైతుకోర్కెలకంటె యెన్నియో మడుంగులు తక్కువయని చెప్పవలసి యున్నది. అధమము గవర్నమెంటు రైతు వలెనైనను తమస్థితిని చక్కబరచమని వేడుచున్న యీదేశ రయితుకును యితర దేశముల రయితుకును యేసామ్యమును లేకున్నది.

యీకోర్కెను సైతము అటకట్టుటకు జమీందారులు పూనుకొనుట విచారకరము. రాగల శాసనసభలో సామి వెంకటాచలము శెట్టిగారు ప్రవేశపెట్టబోవుచున్న రయితు బిల్లు (అనధికారబిల్లు) యీహక్కులనే కొంతవరకు మాత్రము కోరుచున్నది. కాని యెంతోకాలము కాలిక్రిందతొక్కిపెట్టియున్న జమీందారులు యింతమాత్రపు కోర్కెను సైతమున్నించ జాలనిచో తప్పక లోకదూషణలకు గురిగాక తప్పదు. ప్రక్క గవర్నమెంటు రయితు రు 1 శిస్తు చెల్లించు భూమికి, జమీందారీరయితు రు 70 లు శిస్తు చెల్లించుచున్నాడన్న రయితు స్థితియెంత ఘోరముగానున్నదో తెలియగలదు. నేటిపరిస్థితుల దుస్థితియు, ముజరాలివ్వని పద్ధతియు, నేడు రయితును పీల్చి పిప్పి జేసినవి.

కావున పైవిషయములనుబట్టి చూచిన జమీందారీ రయితులు మేల్కొని తమహక్కు భుక్తముల కాపాడు కొనుటకు తగిన ఆందోళనచేయుట అత్యంతావసరము.

నెల్లూరు జిల్లాలోని జమీందారీలలో వెంకటగిరిని మినహాయించిన తక్కిన వన్నియు కొద్ది, కొద్ది జమీందారీలు. యీచిన్న జమీందారీలలో రేబాలవారి గుడ్లదోన యేస్టేటు రయితు తకరారులు తక్కువగ యున్నట్లు వినుచున్నాము. చామవరపు వెంకటసుబ్బారెడ్డిగారి కొండూరు యేస్టేటులో నీటి వసతుల మరమత్తులు, రిమీషనులు యిచ్చుట చక్కగనే యున్నట్లు వినుచున్నాము గాని రయితును చీటికి మాటికి కోర్టుకు లాగుట మాత్రము కలదనివినికిడి. యిక తక్కిన జమీందారీలన్నిటిలో చిక్కులు విశేషముగా నున్నవి. అందులో వెంకటగిరిలో మితిమేర లేకుండానున్నవి.

కాబట్టి రయితు సోదరులారా జిల్లాలోని అన్ని జమీందారీలనుండియు రయితు ప్రతినిధులు విరివిగ మరువెంచితమకుండు కష్టములు చర్చించుకొని నివారణోపాయముల నరయుట ముఖ్యధర్మము. రేపు రయితు బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టబోవు శ్రీ వెంకటాచలము శెట్టిగారు, అధ్యక్షులుగను, జ॥ రయితుసమస్యను గూర్చి శాసనసభలో నిరంతరము పోరాడుటకు బద్ధకంకణులైన మునుస్వామినాయుడుగారు సభప్రారంభకులుగ నుండుట మన భాగ్యవిశేషము. గాన రయితు లెల్లరువిచ్చేసి సభను జయప్రదముగ నెరవేర్తురని కోరుచున్నాము.

## స్వీకారము.

లోకల్ బోర్డు:—

ఈమాసపత్రిక 10-వసంచిక వందనములతో నందుకొంటిమి. నేటిస్థానిక సంస్థలభిరుచికి ప్రత్యేక పత్రిక మిక్కిలి అవసరము. ఈపత్రిక చాగంటి శేషయ్యగారి సంపాదకత్వమున తూర్పు గోదావరి జిల్లా కపిలేశ్వరపురమున ప్రకటితమగుచున్నది. చందా సంవత్సరమునకు మూడురూపాయలు మాత్రము. అందమునసనే గాక విషయమునను చక్కగయున్నది.

పుస్తకములు.

అప్పికట్ల వాస్తవ్యులు ఇనగంటి పున్నయ్యచౌదరిగారిచే విరచితములగు "మాధవశతకము" "ముక్తికాంతావిలాసము" "బ్రహ్మరహస్యము" అనుమూడు పుస్తకములు వందనములతో నందుకొంటిమి.

"జ్వాల":—

ముద్దుకృష్ణగారి సంపాదకత్వమున నూత్నాభిరుచిని ఆంధ్రలోకమునకు చవిజూపుచున్న "జ్వాల" యొక్క 3, 4, 5 సంచికలు వందనములతో పాత్రీకరింపబడినవి. క్రొత్తదనముగుటచే రుచి భేదమున్నను ఆంధ్రలోకము యుచితరీతి నాదరించుట భాగ్యోదయమే!

## సూళూరుపేట

అల్పాహారవిందు.

సూళూరుపేట, వెంకటగిరి, రాపూరు, గూడూరు తాలూకాబోర్డుల అధ్యక్షులు శ్రీయుతులు బద్వేలుపూడి వెంకటనారాయణరెడ్డి కటికినేని కళ్యాణరావు, బొల్లు చెంచునరసింహం శెట్టి, పెనుబోలు వెంకటరామిరెడ్డి గార్లకును, ఉపాధ్యక్షులు, శ్రీయుతులు తొండమనాటి వెంకటస్వామిరెడ్డి, కాసరం చెంచురెడ్డి, ముగళ్లూరు శివయ్య, బి. ఎ, గార్లను సన్మానించుటలో స్వతంత్ర సేవసంఘమువారు 23-వ తేదిసాయంత్రము సూళూరుపేట యందు గొప్ప సభగావించిరి. శ్రీయుతులు తిక్కవరపు రామిరెడ్డిగారు అధ్యక్షత వహించిరి. సభకు శ్రీయుతులు పెల్లేటి వెంకటసుబ్బారెడ్డి, దొడ్ల ముద్దుకృష్ణారెడ్డి, వెన్నెలగంటి రాఘవయ్య, బి. అన్నాస్వామిఅయ్యరు, చుండి విశ్వనాథము, వంగల్లు కోదండరామిరెడ్డి, గూడూరు శేషురెడ్డి, కమతం షణ్ముఖం, పొనకా పిచ్చిరెడ్డి, యామినీపూర్ణ తిలకమ్మగారలు, యింకను నేయిమందికి పైగా సభ నలంకరించిరి. కార్యక్రమము దైవప్రార్థనలతో ప్రారంభింపబడెను. తరువాతఅధ్యక్షులుతమ తొలిపలుకులునుడివిరి. అంతట సన్మానపత్రములు అధ్యక్షులవారికిని తాలూకాబోర్డుల అధ్యక్ష ఉపాధ్యక్షులకును సమర్పింపబడెను. గూడూరు తాలూకాబోర్డు అధ్యక్ష ఉపాధ్యక్షులును, వెంకటగిరి బోర్డు ఉపాధ్యక్షులును సభకు రాజాలనందులకు సభవారు చింతిలిరి. అధ్యక్ష ఉపాధ్యక్షులుఉచితరీతిని జవాబొసంగిరి. పిమ్మట దొడ్లముద్దుకృష్ణారెడ్డిగారును, పెల్లేటి వెంకటసుబ్బారెడ్డిగారును, దేశిరెడ్డి శేషురెడ్డిగారును, బోర్డుల అధ్యక్ష ఉపాధ్యక్షులను అభినందించుచు వారియొక్క సేవాసక్తియు, వోటరుల ధర్మము, యెలక్షనులయందు స్వల్పధనమున కాశించి వోటరులు గావించు తప్పులను గురించి విపులముగ ముచ్చటించిరి. గూడూరు వాస్తవ్యులు శ్రీయుత గాదె మునిసుబ్బరాయుగారు తమ అపారితమగు మురళీగానములో సభ్యులను ఆనందాబ్ధి నోలలాడించిరి.

సభానంతరము అధ్యక్షులవారుతమ అంత్యోపన్యాసమందు పైబోర్డుల అధ్యక్ష ఉపాధ్యక్షులను అభినందించుచు. వారు అనేకులవలె స్వలాభాపేక్షాపరులై రాజకీయరంగమందు ప్రవేశింప లేదనియు, పెక్కుయిబ్బందులకులోనై ప్రజా సేవాభిలాషులై త్యాగము చేయుచున్నారనియు, యెలక్షనులందువోటరులు గమనించవలసిన విషయములను గురించియు, విపులముగముచ్చటించిరి. సభానంతరము అల్పాహార విందుగావింపబడెను. ([illegible])

## హైకోర్టు గలభా.

వెంకటగిరి డివిజన్ పాలెంకోట గ్రామములో యీనెల 20,22 తేదులలో రయితులకును, యేస్టేటు నౌకర్లకును, కొంత సంఘర్షణ జరిగినట్లు తెలియుచున్నది.

## జమీందారీరయితు పత్రిక సంపాదకులకు బహిరంగలేఖ

(గతసంచికానుబంధము)

(2) నా స్వంత యింట్లోని హైస్కూలును యివ్వవలెనని సంకల్పము మీరు మీ పత్రికా విశేషతయొక్క స్వకపోలకల్పితములేగాని నేనుగాని జిల్లాబోర్డు సభ్యులుగాని జిల్లాబోర్డు అధికారవర్గముగాని యున్నదున్నా స్వప్నావస్థయందైన సంకల్పించినది లేదు. హైస్కూలు భవన నూతన నిర్మాణముకు తిరుపతయ్య వనము అను (3) యకరములు భూమి స్థలముకు స్వంత రాయలవల్ల సంవత్సరం 1-కి రూ 100 లు బాడుగలో శాశ్వత కవులుకు యేర్పరచి డిస్ట్రిక్టుబోర్డు వారికేర వ్రాయించి 17-5-1931 తేదిన రిజిష్టరు చేయించి యుంటిని. డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటువారు నా ప్రేరేపణ మీద నూతన భవనముకు యెస్టిమేటును తయారు చేయించిరి. జిల్లాబోర్డువారు యెస్టిమేటు మొత్తమగు రూ 20500/లు శాంక్షన్ చేసిరి. అయితే అస్థలము తెగ విక్రయము చేసుకొననిదే బాడుగ స్థలముమీద జిల్లాబోర్డు ధనమును ఖర్చుపెట్టుట చట్టవిరుద్ధమనియు, అదే స్థలము తెగ విక్రయముకు తీయవలెననియు జిల్లాబోర్డు ప్రెసిడెంటువారు నన్ను కోరగా నేను అదే ప్రయత్నములో యిప్పటివరకు వుండియున్నాను.

(3) పై విషయములన్నియు బహిరంగముగా ఆయా పట్టి గమనించగల ప్రతి వ్యక్తికిని తెలిసియుండి మీకును నిజస్థితి తెలిసియుండునని తలంచెదను. ఒకవేళ తెలియకుండినను రయితు సంఘనాయకుడనియు రయితు పత్రికా సంపాదకుడనియు చెప్పుకొనుచుంటూ తమ చేయివలె పైగల నిజానిజములను గుర్తించక వదంతులనే పేరుతో అసత్యము వ్రాయుట పత్రికా సంపాదకుని ధర్మము కాదు.

(4) శ్రీ వెంకటగిరి కుమారరాజాగారు మొన్నటి జిల్లాబోర్డు అధ్యక్ష ఎన్నికలలో తమ వంతు మిత్రులు తమ పత్రికయు ప్రతిపక్ష దుర్వ్యాజ ప్రచార మొనరించినను అధిక సంఖ్యాకులతో విజయ మొందుటయు అట్టి విజయముకు నేనున్నూ నా మిత్రులు ఖాన్ బహదూర్ యేబ్యాలి సాహెబుగారును రావుసాహెబు అబ్బయనాయుడుగారును కొంతవరకు తోడ్పడితిమని తెల్పుకొని విమ్మ మనస్కులై యిట్టి వ్రాతల మూలకముగా మమ్ముల తొలగించుట కొనకలేనని తలంచుట తమకు గొప్ప పొరబాటు.

(5) ప్రజా ప్రతినిధులుగా నేమిందుకు తమకు తోచిన విధముగా తలంచినంతట మా ప్రతిష్ఠల నిల్పి మమ్ముల యెన్నికలలో వోడించుడు. ప్రజానురాగముకు నేము పాత్రులము కామని మీకు తోచిన యెడల అది యెట్టిదో నిజము ప్రకటించి నిరూపించుడు. నేము తప్పతోవల త్రొక్కుచున్న పక్షముకు సరియైన త్రోవ యిట్టిదని సక్రమం దోకనసే చూపించుడు. మీచేవ్రాయు బకు పరమాన పరనిందారోపణ అసత్యప్రచారములు మీరు ఈ సంఘమునకు కళంకము తెచ్చునని మీరు తెలుసుకొనుటయందుకే మీ పత్రికయందు ప్రకటన అవశ్యకత జనించునని గమనించుడు.

(6) పై కారణముచే తమపత్రికకు వ్రాసిన వితరణ రూపములో తెల్పబడినయిట రాబోవు సంచికకు ఆ వ్యక్తికి మరికొన్ని విషయములు వనవిచేత కోరుచు

కనిగిరి
7-3-1933 } యిట్లువిన్నవించు
సానికొమ్ము మాలకొండారెడ్డి.

## మునిసిపల్ సమావేశము

తే 20-3-33 ది వైస్ చేర్మెనుగా రధ్యక్షత క్రింద జరిగిన సమావేశము మొదటి నుండి ఆఖరు వరకు రసాభాసంగానే యుండింది. మాటిమాటికి "మిష్టర్, మిష్టర్" "ఇదో, ఇదో" అని పాకం వినయపూర్వకముగా గలభాచేయవద్దని వైస్ చేర్మెనుగారు బ్రతిమాలుకుంటె సభ్యులు వింటెగా.

బండ్లరిపేరు కొందరు చర్చకు వచ్చింది. అక్కడ వెంకయ్య కొందరు రేట్లు బ్రహ్మయ్య వాటికంటె చాలా తక్కువ. అంచనాల శేషయ్యగారొక సిద్ధాంతము బయటపెట్టారు. గత సంవత్సరములో చేసిన కంటాక్టులో కొన్ని సామానులు బ్రహ్మయ్యవద్ద మిగిలి వున్నాయి కాబట్టి, వెంకయ్యపెట్టిన రేట్లకు బ్రహ్మయ్యకే కట్టి పెట్టాలన్నాడు. మహబూబ్ ఖాన్ గారు న్యాయంగా వెంకయ్యకే యివ్వకతప్పదన్నాడు. ఈముక్కలు యీయన అనేటప్పటికి పార్టీవాళ్ళందరియొక్క మొఖాలు వెలవెల పొయ్యాయి. పార్టీ బ్రద్దలగుతుందేమోయని బెంగపడ్డారు. నాయకుడు లేమింకేసి డిసిప్లిన్గా చేతులెత్తడానికి తయారై యీసారి రావట్టింది. అంతట ఖాదర్ మొహిద్దీన్ సాహెబుగారు యీ విషయాన్ని మరు మీటింగువరకు నిలపాలని అన్నాడు. పాపము కొందరు అలాచేయడం అన్యాయం అంటువినేవాళ్ళు వరు. మరు మీటింగులో యీకథ యేలానడుస్తుందో చూతాం.

(ఒక లేఖరిచి.)

## నె॥ జి॥ జ॥ రైతుసంఘకార్య నిర్వాహక సమావేశము.

---

1933 సం॥ మార్చినెల తే 23 ది రాత్రి 9 గంటలకు సూళూరుపేట రెస్టుహౌసులో సమావేశమైనది.

హాజరయిన సభ్యులు:— 1 గుజ్జలపూడి వెంకటసుబ్బానాయుడు 2 కటికనేని వెంకటాద్రిమారావు 3 నెల్లూరు వెంకటాద్రిమానాయుడు 4 బద్దిపూడి వెంకటనారాయణరెడ్డి 5 వేనాటి వెంకటరెడ్డి 6 వెన్నెలకంటి అప్పారావు 7 వేనాటిమునుస్వామిరెడ్డిగారలు.

శ్రీయుత కటికనేని వెంకటరామారావుగారు తాత్కాలిక అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. యీక్రింది తీర్మానములు గావింపబడెను.

1 కీ॥ శే॥ చిట్టమూరు వెంకటసుబ్బారెడ్డిగారి అకాలమరణమునకు, యీ సంఘమువారు చింతించుచూ వారికుటుంబమునకు ఈసంఘమువారు సానుభూతిచూపుచున్నారు.

2 వెంకటగిరిపల్లెలలోని రయితుల కున్నా వెంకటగిరి జమీందారుగారికిన్ని గత 2 సం॥ నుండి పెరుగుచున్న కంచెవగైరా తకరరులను నిష్పక్షపాతముగా పరిశీలించి రయితుల కష్టములను గమనించి నీలయినంతవరకు రయితులకు న్యాయము కలిగించు చుండుటకు ప్రయత్నించుచున్న నెల్లూరుజిల్లా కలెక్టరువారికిని, జిల్లాపోలీసు సూపరెంటెండెంటు గారికిని యీసంఘము వారు కృతజ్ఞతాపూర్వక వందనములాచరించుచున్నారు.

ఉప॥ బద్దిపూడి వెంకటనారాయణరెడ్డి

ఆమో॥ గుజ్జలపూడివెంకటసుబ్బానాయుడు

3 యీసన్న 1342 ఫసలి క్షామసంవత్సరముగాయున్నందున యీఫసలి సుక్కిబంజర్లు రివిూషన్ ఆలశ్యముచేయక వెంటనే తీర్మానించుటకు యీలోపల సదరు భాప్తుభూములకు సంబంధించిన శిస్తువసూలు ఆపుచేయవలసినదిగా కోరుట వగైరావిషయమై మాట్లాడుటకును తీర్మానించడమైనది. యీక్రిందివారిని రాయబారము పంపుటకు ఉపసంఘసభ్యులు.

1 బద్దిపూడి వెంకటనారాయణరెడ్డిగారు.

2 గుజ్జలపూడి వెంకటసుబ్బానాయుడు

3 జూపల్లి రామకృష్ణరావు.

4 యీసంవత్సరము అన్నిగ్రామములలోనుపంటలు చెడిపోయి రివిూషనుల విషయమై జమీందారులకు రయితులకు వివాద గ్రస్తములుగానున్నవిగాన, వెంకటగిరి జమీందారీలో అన్నిగ్రామముల నే టిస్థితిగతులగూర్చి నిజస్థితులను గూర్చి తెలుసుకొనుటకుగాను డిప్టిత హశీలుదారులవద్దనుండి రహస్యపురిపోర్టులను (confidential) తెప్పించుకొవలసినదిగా శ్రీకలెక్టరువారిని యీ సంఘమువారు కోరుచున్నారు.

24_3_33 ఉదయం 8 ఘంటలకు తిరుగామీటింగు ప్రారంభించడమయినది.

5 సూళూరుపేటయిలాకా, కాళింగినదినుండి ప్రవహించు కాలువలు, చెరువులయొక్క-మరమ్మతులు చాలాకాలము గాలేక దుస్థితియందుండి, ఆకారణములవల్ల రయితులు నానాటికి క్షీణదశకువచ్చి యుండుటవల్లను, పాములకాలువ, కల్లిపేటకాలువలకు అడ్డకట్టలుకట్టి వాటిక్రిందపారుదల గ్రామములకు నీటివసతులు కలుగకేయుటనుగూర్చి, జమీందారు గారికి నివేదించుటకు యీక్రిందివారిని ఉపసంఘముగా నియమించి వారియిష్టమువచ్చినవారిని 5 గురిని చేర్చుగొనుటకు అధికారము యివ్వడమయినది.

ఉపసంఘ సభ్యులు.

1. మారం రెడ్డి మునిరెడ్డిగారు.
2. వేనాటి మునుస్వామిరెడ్డి గారు.
3. కాకు సుందరరామిరెడ్డి గారు.

## నె॥ అ॥ డి॥ ము॥ కోర్టులో.

---

S. Cs. No—2210/32.

గుండ్రా రామకృష్ణారెడ్డి:—వాది.

మాగలపురు కొండయ:-—ప్రతివాది

యీనెంబరు వాది, యీనెంబరు ప్రతివాది మీద ప్రోనోటునుబట్టి దావా చేసియున్నారు. వాయిదా 29_3-33 తేదీ అయియున్నది. కాబట్టి అనూషణ వ్యక్తులు పైవాయిదాకు 10 గంటలకు తెలుపుకొనేది. లేనియెడల పరోక్షమున తీర్మానించబడును.

పురిగండ్ల ఆదినారాయణ మూర్తిగారు.

వాది ప్లీడరు.

---

## త్రిలిజ్గ

---

మత, సాంఘిక, ఆర్థిక రాజకీయ పారిశ్రామిక విషయముల నిష్పక్ష పాతముగ చర్చించు వార పత్రిక. సంవత్సర చందా రూ 2½ మాత్రము. వలయువారు క్రింది చిరునామాకు వ్రాసి తెప్పించుకొనుడు.

మేనేజరు 'త్రిలిజ్గ' 323, హాయిరోడ్డు, తండియార్పేట, మద్రాసు

---

4 వంకాయలపాటి సుబ్బరామానాయుడుగారు

5. కిలారిచిన మునిస్వామి నాయుడు గారు దీనికి కన్వీనరుగా శ్రీయుత వేనాటి మునుస్వామి రెడ్డిగారినియమించడమయినది.

6. వచ్చేమీటింగు తే1_4-33ది సాయంత్రము 6 ఘంటలకు జయింపు గ్రామములో సమావేశమగు నట్లు తీర్మానించడమైనది.

---

